# CHENNAKESAWA SATAKAM.










BY,

G. KRISHNAMURTY.

# విజ్ఞాపన.

ఈ శతకము నా బాల్యమందు (అనగా) 1921 - 22 సం॥లు మధ్య నా సోదరుని ప్రోత్సాహముచే పాశర్లపూడి వేలుపైన చెన్నకేశవస్వామిపై రచింపఁబడి వెంటనే ముద్రించుటకు సిద్ధపర్చబడి కారణాంతరములచే ప్రకటింపబడలేదు. దానిని నేను యథామాతృకగా సవరింపక ముద్రించుటవల్ల నచ్చటచ్చటఁ గొన్నిదోషములు కలిగియున్నది. ద్వితీయ ముద్రణమున దోషములు పరిష్కరించి ప్రచురింప గలవాడను. సాధ్యమయినంతమట్టుకు తప్పొప్పులు జూపియున్నాను. ఈశతకముద్రణకు ముందు పద్యములు classification జేసి వ్రాయుటకు సాయపడిన మ॥రా॥శ్రీ॥ Y. కామరాజు, S. వెంకటదీక్షితులు గార్లకెంతయేని కృతజ్ఞత జూపుచున్నాను.

గ్రంథకర్త.



# చెన్నకేశవశతకము.



ఉ॥ శ్రీకరమైనబుచ్చి న్నృపశేఖరు పట్టపుదేవి భక్తితో
లోకముఁబాసి దానచింతలోఁబడఁ దఘ్నవకౌర్యచిహ్నమై
వీకఁదనర్చు నీపురపు పిప్పలశాఖల మూటినెంతు నేఁ
బ్రాకట సత్కవిత్వ పటిపాటవమొప్పఁగఁ జెన్నకేశవా! 1

ఉ॥ పాయనిదీక్ష నేనొక ప్రభాతమునన్ బాలమేగివచ్చి వా
తాయనమారుతోర్మ్యులు ముదంబొనరింపగ నింట భోజరా
జీయముఁ జూచు నన్దరికిఁ జేరివచించె మదగ్రజుండు నా
రాయణమూర్తి కుందమకరంద సమోక్తులఁ జెన్నకేశవా! 2

చం॥ అతులపరిశ్రమన్నడపినట్టి కవిత్వములంతిఁ బోవగాఁ
గుతుకమొనర్ప కంతమునఁగూర్చు కిరీటము చెన్నకేశవున్
శతకమనేక నీతిమతసాంఘికనిర్గుణతత్త్వసాంగ సం
స్తుతి విపులం బొనర్పుమని సోదరుఁ డేర్తైజిఁ జెన్నకేశవా! 3

ఉ॥ ఆనరొయిసంగువాఁడు నిఖిలాగమవేది మదగ్రజుండు సం
ధానకవిత్వ మాంధ్రము సమంచితవర్ణన వాసుదేవు గా
థానకమింక లోటునకుఁ దక్కగ నేల వచింతు నేర్పునన్
బోని కవిత్వసంపదను బుష్కరలోచన చెన్నకేశవా! 4

ఉ॥ ప్రేరకుఁడన్న వ్రాసి వినిపించుట యీపురినున్న నిన్ను నా
కూరకపోవు ఘుస్రము లనూనఫలప్రద హేతువుల్ నితా
ధారకవిత్వవల్లరి యథాశ్రియ వృక్షమునై తనర్చె నీ
పేర కవిత్వమాది వినిపించుచునుండుట చెన్నకేశవా!

చం॥ పటుతర సత్కవిత్వ పరిపాటినిఁ జాతకమర్మబోధమున్
ఘటన మొనర్చినట్టి కవిగండరగండుని వేఁదలంతు నుండపల్క
బటుతర శబ్దసంతతులు జాఁబడిఁబోఁక తలంపునుంచవె
కటురమణార్యమూర్తిని సుఖస్థితిగాకను చెన్నకేశవా!

## సగుణశతకము.

ఉ॥ సారసనేత్ర చక్రధర శౌరి జనార్దన కృష్ణ శ్రీషం
దార మురారి మాధవ గదాధర కేశవ వాసుదేవ దై
త్యారి చతుర్భుజాచ్యుత మహాంధ మధుద్విషకంసకై టభ
ద్వైరి హిరణ్యనేత్ర ఘనపాప విభంజన ॥చె॥ 7

ఉ॥ కాళియదర్ప సంహరణ కంసవిభేదన ధేనుకాది దై
త్యాళి పరాసుకారణ మహావిభవాసుర రావణాంత భూ
పాళివిమోచనాయత శుభాన్విత పాండవపక్షపాత భూ
పాళి కధిష్ఠవర్తన విధానచరిత్రము ॥చె॥ ౮

ఉ॥ ప్రేరణదూతు హస్తిని హరిని భుజంగముఁ జావఁద్రొక్కి కాం
తార తటాకసాగర మతంగము గాచి పరిలంబుఁజంపి శృం
గారవనీ సముహములఁ గను పదాంకములుంచినట్టి యా
భీరకులాంగనావిటుని వేఁడి నుతింతును ॥చె॥ ౯

ఉ॥ పాలిత యుగ్రసేన పరిపాలిత పాండవపంచకా సమా
లోలధనంజయాత్మ పరిలోల విభంజనతత్త్వలోల వా
తూల సురద్విషాంతక విధుంతుద సంభవహేతుభూత పా
తాళ సమర్పితోగ్ర బలిదైత్య మురాంతక ॥చె॥ 10

చం॥ కమలసమాక్ష్య కక్షజిత కంచుకరాధ కుచాగ్రసాగ్ర సం
యామ యమలోకసాందిపసుతాగతకారణ కారణోద్భవా
దివస్థవ భావజాత వివిధేచ్ఛ విభంగుర లాభలోభ పా
పమతి సుయోధనాంత కృతఖండన కారణ ॥చె॥ 11

ఉ॥ పూతకి ప్రాణసంహరణ పుణ్యజనావనభామ జీవసం
ఘాత లయాంతకవ్రజనికాయ మనోహర ధేనుకాది సం

ఘాతన పద్మయోని హరిగర్వ విభంజన రుక్మికేశసం
ఘాత లతాలవిత్ర సుముఖస్థిరవీక్షణ ॥చె॥ 12

ఉ॥ భావజరూప పాపజనపావన రావణదైత్యపంక్తి దా
రావణ బావదగ్ధపరిరక్షితగోవ్రజ దత్తరూప సం
భావిత కుబ్జ సంయమిసభాప్రముఖ స్థిరదత్తరాజ్య సు
గ్రీవదలంతు నిన్ను పరికింపఁగఁ జేరిమను ॥చె॥ 13

చం॥ నలినదళాక్ష మాధవజనార్దన శత్రుజితోగ్రచక్ర సం
కలితభుజాగ్ర పాండవనికాయసమర్ధన వంశవర్ధనో
జ్జ్వలిత దవాగ్ని భోజన సువర్ణశరీర సుధన్వకేశవాయ భూ
పాల పురుషోత్తమాచ్యుత పతంగతురంగమ ॥చె॥ 14

ఉ॥ శాంతశరీర సర్వదృశ శాశ్వత భూతకృతే భవాయ స
ర్వాంతర మానశౌరి పరమాత్మ బకారి పవిత్రదేహ వి
శ్వాంతర సాక్షిభూత భవసాగర శోషణకుంభజాత భూ
తాంతరవర్తనీయచరితా మధుసూదన ॥చె॥ 15

ఉ॥ అంధకపౌండ్రవృష్టి భువనాధిపజీవగతాసుభూత గ
ర్వాంధసుదామ సంహరణ రాసవిహారితకేశవా జరా
సంధమృతార్కజాత పశుసంఘుపరీక్షక మిత్రవింద పు
ష్పంధయ నీలవేణి పరిపాలితకాముక ॥చె॥ 16

ఉ॥ ఓ రవిసోమనేత్రయుగ యోపురుషోత్తమ యోహిరణ్యరే
తారుణదేహయో క్రతువిధానక యోప్రభవాయ కేశిసం
హారక భక్తవత్సల మహాక్రతుపాలన పుణ్యకీర్త యో
వీరవష్ఠ తీర్థకరవేణు కరాంచిత ॥చె॥ 17

ఉ॥ నాయకదానవాంతక ప్రవర్షణ గహ్వరవర్తనీయ శాం
తాయ విశోధనాయ విజితాత్మనసాగరశోషణాయ నీ
లాయ చతుర్భుజాయ విమలాయ శమాయ కృతాత్మనాయ నా
రాయణ విశ్వభుగ్విభవరంజిత మాధవ ॥చె॥ 18

ఉ॥ సురపతియాగభంజన విశోషణ కాళియ దండకూక సం
హరణ బకాదిహింసవిచకాసురసంఘ ముకుంద ధర్మజా
ద్వారపరిపాల శౌరి వృషభాసురజీవకృతాంతతుల్య సుం
దరనరకారిబంధితనితంబినికాముక ॥చె॥ 19

ఉ॥ యాదవసింహ కృష్ణ యమళార్జునశాపవిమోచనాంగ నా
మోదకుభాంగ రాధికవిమోహన నిర్గుణ దంతవక్త్రవి
చ్ఛేదన భూతభావన కుచేల సమర్పిత దివ్యభాగ్య దా
మోదర పారిజాతపరిమోషక శ్రీధర ॥చె॥ 20

ఉ॥ అంగనృపోపజాపకృత యుత్న కిరీటికిరీటరక్షణా
నంగసమానరూప కరుణార్ణవ నారదగానలోల భూ
తాంగపతంగవాహనమతంగవగాంగవిభంగసంగతా
పాంగవిలోల భీష్మకనృపాత్మజసంగమ ॥చె॥ 21

చం॥ గురుకరుణార్ద్రదృష్టి ముచికుందునిపై ధరపై గుచేలుపై
కరిపయిఁ గుబ్జపై మునులకాంతలపై హరిపై యశోదపైఁ
బరపిన నీకటాక్షపు లవంబొకఁ గొంచెముఁజూపు నాకు నీ
చరణమునమ్మినాడగద శౌరి గదాగ్రజ ॥చె॥ 22

చం॥ నరుపయి యుగ్రసేనుపయి నారదుపై గుహుపైఁ గపీంద్రుపై
హరిపయి గోపికాంగనలపై గిరిపై ద్విజుపై జటాయుపైఁ
బరపిన నీకృపాంబుధిలవాంబుకణంబు నొకింత గల్పు నీ
చరణ విసప్రసూనములు చక్కఁగ నమ్మితి ॥చె॥ 23

ఉ॥ వ్యాళమునందు భక్తజనపావనుఁడౌ ధ్రువునందు గోపికా
జాలమునందు నందపశుజాలమునందు మునీంద్రులందు పాం
చాలియెడన్ వహించిన రసార్ద్రకృపాంబు తుషారమింతపైఁ
జాలుపు నీపదాబ్జములెరంబుగ నమ్మితి ॥చె॥ 24

ఉ॥ పారునిపైఁ గుచేలుపయిఁ బావనిపై హరిపై కపీంద్రుమ
కూరిరులపై మహేంద్రుపయి కూరభుజంగముపై విముగ్ధలా

ధీరలయందు దేవకివిభీషణులందునఁ జూపినట్లు నీ
సారకృపార్ద్రదృష్టి నిడజాగిలి మొఱ్ఱిక్కడ ॥చె॥ 25

ఉ॥ నారదగానలోల సుగుణాకరబృంద వనాంతమార్గ సం
చార తృణాసురాంతక తుషారమహీధరమౌళి తాపసో
దార ముకుంద పాండవముదప్రద మాధవ సారసాక్ష సం
సార విదూరదూరతర సంస్తుతిలోలుప ॥చె॥ 26

చం॥ పతగతురంగ సంగర కృపాకృత కౌనవభల్లు కేశ వే
ల్లిత శికచాపసంగత కులీన రథాంగకరాగ్రసాగ్ర భా
రత విదితాత్మ వర్తన పరాశర పట్టణవాస వాసవా
ర్చిత పదపద్మ దుర్విధ కుచేల సమార్చన ॥చె॥ 27

చం॥ అతులగుణానురాగ వినయాంచితపాంధ్రశతాంగసాంగ్రే
పతితమనుష్యపావన కృపార్ణవ వ్రీడమానపాలనా
రతిపతితుల్యసుందర పరాశరపత్తనవాస వాసవా
ర్చితపదపద్మ దుర్విధకుచేలసమార్చన ॥చె॥ 28

ఉ॥ వేదములుద్ధరించి యాతశైలభరంబునఁ భూమిదాల్చి సం
వాదములోఁ జయించి యలపాండుసభన్ వృషకేతుకుత్తులక్ష
ఛేదమొనర్చిరాజులను చేయనిదేదిధరిత్రినీవుఁ నీ
పాదమునమ్మినాఁడ నను పావనుఁజేయవె ॥చె॥ 29

చం॥ హరినిహరించినాఁడవు నహల్యను బ్రోచితి వడ్డికుద్ధక్ష
శరము పొడంగినాఁడవు విశాలగభీరవిదారకాంబువో
పరివృఢునెత్తినాఁడవు విపద్దశనున్నఁ గరీంద్రుఁగాచి పు
ష్కరనిలయున్వరించితివి కంజవిలోచన ॥చె॥ 30

ఉ॥ వాసవదర్పభంజన విభాస్వర చంద్రవిలోక గర్వవ
త్సాసురదైత్యమర్దన కృతాంత కిరీటిశతాంగసారధీ
వాసుకితల్పకల్పిత శుభాంగ నృగేంద్రశరీరరూపహా
నూసర వెల్లినెత్తి నయనూనకృపార్ణవ ॥చె॥ 31

ఉ॥ కరమరయంగ నారదముఖాదిసనందనులేల కృష్ణసా
గరులఁ దలంపనేల కలికాలుఁ బ్రు ధూర్జటిఁ గోపనాములన్
సరవిగఁ బోలఁజాల నినుఁ జాలి నుతించుటలందు దీనుడన్
గరుణవహించి నన్ను బ్రోవు గావఁగ వేడెద ॥చె॥ 32

## మహిమశతకము.

ఉ॥ ఉరగభయంకరోన్నతశిరోపరితాండవరంగభూమి సు
సిరశయనోన్నతామలవిధిస్తవశేషభుజంగమంబు నీ
శ్రీకరయగతల్ప మంమఁదరిఁగాననిసింధువుఁ గాపురస్థలం
బరిమురిఁ గాదె నీచరితలద్భుతమన్నిట ॥చె॥ 33

ఉ॥ నీవుఁడలంప సాగరులు నిర్జలమై నగరంబులౌను నీ
భావనచేఁ బురంబులు నిబంధసముద్రములై ప్రవాహరే
ఖావిభవంబునొందుఁ నినుగావము సేయు సమర్థశక్తి నా
కేవిధి నెట్లు వచ్చు? పరికింపగ మూఢుడ ॥చె॥ 34

చం॥ పరమఖలుండు రావణుఁడు బాహుబలంబున లంక నేలుచున్
ఖరదుముఖాది సైనికులఁ గాపురముంచెను దండకాటవిన్
బరమమునీంద్రసంఘముల భారతదేశమునందుబాధలన్
బొరియఁగ జేయ చెల్లినవె బోరిజయింపవె ॥చె॥ 35

ఉ॥ మేకొనినిన్ను మున్ను యల మేఁటి పరాశరసంయమా(శమా
లోకత వచ్చిఁ గుంభజుఁడు లోలతగొన్ని దినంబులుండి ని
న్నకడఁ దాప్రతిష్ఠవెలయించిజనన్భవిఁబూడి ధన్యమౌ
పోకడఁగాంచి చెన్నహరిపోలిక బల్కరి ॥చె॥ 36

చం॥ అరసివివిక్తమంచునుఁ నిజాశ్రమశాలపరాశరుండు నీ
ధరణిరచించిసంయమవిధానరతుండఁ నగస్త్యతాపసుం
డెరిఁగి దవంతపచ్చి రచియించెను నిచ్చట నీప్రతిష్ఠ ని
ర్జరపరిసేవ్యమాన జలజాలయవల్లభ ॥చె॥ 37

## శృంగారశతకము.

ఉ॥ రాసవిహారకేళి నొకరామకు రామకు మధ్య నీవు నెం
తో సమయోచితాకృతి యథోచితవేషముఁబూని గ్రోవితో
భాసిలు హస్తపద్మ మిరువాగులఁ గోపికలంటిరాగన
భ్యాసవిచిత్రలాస్యమున బాడుట నెంతును ॥చె॥ 38

ఉ॥ ఊదినగ్రోవియీలకుసముద్భవరాగవిరాగలై విశే
షాదరులై విహస్తలికిఁ జయ్యన వచ్చెడిఁ గోపికాళికిన్
మోదరతిప్రవీణతసముద్భవకౌతుకమిచ్చి బంపు దా
మోదరు మారసత్క్రియలు బుద్ధిఁదలంతును ॥చె॥ 39

చం॥ శిరము మయూరపింఛపరిసేవితమంగకము యక్షకర్దమం
బెరసిసుగంధమివ్వగ యథేప్సితగోపకుమారసంగ్రహా
భరణకరాగ్ర రాధికనవాగతవర్తులపీనకర్కశా
కరకుచపర్వతాగ్రఘన కౌశికసోదర ॥చె॥ 40

ఉ॥ వల్లరులుల్లిజొంపముల పాదపపాళిఫలాదిభారముల్
బల్లముఁ వంగి మార్గమిరువాగులఁ నాతపమడ్డగింప. సం
ధిల్లెడు నీడలన్ దిరుగు దివ్యచరిత్రునిఁ బద్మనాభునిన్
వల్లవపల్లవాధరలవల్లభు నెంతును ॥చె॥ 41

చం॥ మకరపతాకసంగరసమాహ్వయలాంఛనవేణునాద మా
గకవనవాయువీచికలఁ గర్ణరసాయనమైఁ దనర్చినన్
సకలముఁబాసి గాంతలభిసారికలై. నినుగూడ రాగ చెం
తకు యమునాంబు తిన్నెలకుఁ దార్చుట నెంతును ॥చె॥ 42

ఉ॥ కాననపారిభద్రనగకల్పితడోలికఖట్వమందు చం
దాననరాధకుంభకుచరాజినఖాగ్రములందుఁమీటుచున్
పీనపయోధరోన్నతవిసిలతనూరుహాళోమహర్షణా
నూనముదగ్రదం బగు వినూత్నవిలాసుచ ॥చె॥ 43

చం॥ సరవిగ పారిజాతనగశాఖకమర్చినఁ దీఁటుయ్యేలన్
దొరఁకొని రాధతో ముదముతో కుచకుంభములాత్మవక్షమం
దొరయఁగ దూఁగుటుయ్యేలనఁ దూగెదు నీ తులశీవనాంతరాం
తరపరిపూతకేళిమదినాఁట దలంతును ॥చె॥ 44

ఉ॥ చిత్తజబాణవహ్నులకుఁ జేవదొరంగి మనోరథవ్రజం
బుత్తది సేయఁదూతికలఁ బుచ్చి రమింపఁగఁ దెచ్చినట్టి మే
నత్తను గూఁడు నిన్ను గనియాసలుబొంచెడి వల్లవాంగనల్
చిత్తములూర దృష్టులను సిగ్గుగబుచ్చవె ॥చె॥ 45

ఉ॥ మౌళిమయూరఫించమొకమాదిరియైనమిటూఁగఁ మొప్ప వా
హ్యాళివిభాకరాత్మజపయస్విని ఘట్టములందుఁగ్రోవి పా
టీలలఁగుర్తు గోపికలఁబెంకికి దెమ్మ్రని రాయఁభారిచే
వీలుఁగ బంపి వాఁరి బిలిపించి రమింపవె ॥చె॥ 46

ఉ॥ సారసచక్రశబ్దములఁ జక్కఁగ గ్రోవికి మేళవించి శృం
గారముగా విచిత్రపరికల్పితచంద్రశిలాభిరామమై
తీరగనున్న మెట్ల పయిదేశమునన్ సుషిరంబునూదు నీ
చారుచరిత్ర నెంచెదను సారసలోచన ॥చె॥ 47

ఉ॥ కూటమికొప్పమిఁగినిని గోపముతోఁడ నిశీధమందు బృం
దాటవిలోని కుంజములఁదట్టుచు బోవ నొకానొకందు నీ
కూటమి నొల్లనట్టి యలకోపితరాధలభింప కేళిలో
మాఁటలులేక తృప్తిపడి మాయవచింపవె ॥చె॥ 48

ఉ॥ సంగరమందు పంక్తిశిరుజంపి విమానములో నయోధ్యకున్
చంగునవచ్చి నేతవయి సౌధములోన మహీజతో సుఖా
సంగవిహార వర్తనలనన్యమెఱుంగక నే ప్రజార్ధితా
సంగతినున్న నిన్గొలుతు సాగరభంజన ॥చె॥ 49

చం॥ ఎవని విహారకుంజముల కేగి నిశీధములందు కొంతుసిన్
గనుటకు వార్చియున్న యలకొంతల కందరకన్ని రూపులై

మనసిజతంత్రమందు సముంబుగ బొందగ జేయు విశ్వరూ
పమునినుపాపసంహరణ బుద్ధి దలంతును ॥చె॥ 50

---

## —♦ ప్రకృతిశతకము. ♦—

చం॥ అరయ నిమేషమాదిగల యబ్దము లెన్నిగతించు చాయువు౯
హరణమొనర్చి గానిసమయంబగు నొక్కనిమేషమందు నీ
స్మరణమెఱుంగ కాలమనిశంబునుబోయె వృథా! భవాబ్ధినే
సిగమని నమ్మిబొందితినిఁ జేటు జనార్దన ॥చె॥ 51

చం॥ పనిగొని నిన్నొకండు బలవంతముఁసేయఁ దలంచు భక్తికి౯
గనుఁగొన నెంతపాటిదదిఁ గాలవశంబునఁ బక్వపాకమై
దనరనిదంచు నెంచ నిరతంబు ప్రియత్న మొనర్పజాలమిన్
మనుజుఁ డధోగతి౯బడుట మానఁడు నింతకు ॥చె॥ 52

చం॥ అరఘుఁ నిమేషకాష్ఠఘటికాయామినిసంధ్యలుపక్షమాసవ
త్సరములనఁగ్గభోగత్రిపరతా శుభరంబునఁ నెల్లవేళలన్
గిరగిరఁ గాలచక్రము నొకించుకఁ నాగక నిట్టిఁ చెవం
దరఘుడియైన నిద్దలపనంతటి మూఢుడు ॥చె॥ 53

ఉ॥ పూరివొడంగి బ్రహ్మకును భూషణదూషణలెన్ని జేసినన్
వాగకనిన్ను చెందను భువంబఖిలఁబును నీవునిండుట౯
పేర్రికుడైన దెమ్మరకు రెగనిభస్మముఁ నేమిఁజేయగా
గారణమౌను నుర్వినటుగాదొకో దైవము ॥చె॥ 54

చం॥ పరిచయ పండితోత్తముల భావములుత్తముగాదు గొత్రలా
గురువులభింప డెచ్చటను ఘోరవనంబుల నుండు నేమొ నా
పరిచయభాష్యపాళి బలవంతముసేయవు శంకబోవ నే
నరుఁడనుగాని గృష్ణుడిక నాకు లభింపడు ॥చె॥ 55

ఉ॥ మీసలుఁగడ్డమున్ మ్నెనిచి మీదికిబోఁవుట కూర్ధ్వకేశముల్
రాసులుఁగూర్చి ముక్తికి పరంబగునట్టి విచిత్రమైన యీ

ఊసరవెల్లి దైవముల నూరక నేఁలవలంప భుక్తికిన్
బ్బాసి నిశీధమంతకును ప్రాప్యమదేఁటిది ||చె|| 56

చం|| సరుఁవలెఁ గోరజాలదగ నంతటి నెమ్మివహింపలేమి నే
ద్విరదముపాల్కఁ నక్రిపరి దేవనలేమి వచింపనట్లు న.
న్నరయఁ గుచేలుచందము కనన్గాము బాల్యమునందునట్టిదా
పరిచయమేమి లేదిక భవాశ్రియముండెను ||చె|| 57

చం|| దొరకొని చింతసేయుటకుఁ దోచని భూరివిశంకటోన్నతా
భరమగు భీతిహేతువు భవాద్రి శిరంబునఁదాల్చి లేమికిన్
భరపడి ముంమబోవఁ దరువాట్లువహించి ననిశ్చలాత్మ కా
తరమునఁ జేటునొందుటలు తథ్యము శ్రీధర ||చె|| 58

చం|| దొరకొనిఁ దీవయుయ్యెలలఁ దోడను వల్లవపల్లవాధరల్
మరివగు నిన్నునాథనిడి యామినులందు కళింగకుంజ మం
దిరములఁ బూర్ణచంద్రికళదేజమొసంగ కళిందజాసరి
ద్దరులను నూచుభంగులు ముదంబుననెంతుచు ||చె|| 59

ఉ|| వానుడిమాఁటపోకడల నాటికినాఁడు దెలుంగుబాసలో
నానుడి ఛన్నశబ్దమది నాడగ చెన్నయటఁన్న మార్పునన్
స్థానమునొందె క్రోధకృత తామరసాక్ష మనోజపాయ సం
ధానకుపావివాహగిరి ధారణ శ్రీధర ||చె|| 60

---

## ——♦ మానసశతకము. ♦——

చం|| అలయను సగ్గుచెందను మహాద్భుతసంగతి నెట్టివస్తువుల్
గలస్రజనించె మానసము గాసిలక్షణంబులోన వం
దలు పదినూర్లు లక్ష లయుతంబులు సర్బుద సంఖ్యలైన వాం
ఛలు జనియింపజేయుఁటకు సారసలోచన ||చె|| 61

చం|| తరుగని కామసంతతులఁ దామరతంపరలై యజస్రమున్
బెలుఁగునుగాని జాపిలఁ బ్రీతివహించి ప్రపంచబాంధవం

బురలకయుండినన్ గుబుసమూడ్చుగతిన్ భవమూడ్చి నైజబం
ధురపరతత్త్వమంచుట లధోక్షజ మోక్షము ॥చె॥ 62

చం॥ సిరిచెడి జీవయాత్రకతిచిక్కుఘటిల్లి హృషీకపాళి గో
చరవిముఖత్వమొంద మది చక్రివిచారముఁ సేయుచున్న దు
ర్భరభ్రమనోరథాళి సురవర్త్మవిమాన విహారులై మనో
భరమొనరించు ప్రాణికి సువర్ణనవాంబర ॥చె॥ 63

ఉ॥ వేసరవింద్రియంబులుఁ దివిష్టపరాజ్యసుఖంబుగల్గినన్
చేసినసేతకున్ దనట వెందియుఁ బారిసుపక్రమింపగాఁ
కోసెనుగాని తృప్తిపడి కోయవు శేముషి యింద్రియాళికి
న్యాసటయున్నదట్లు నిది నైజము వాఁటికి ॥చె॥ 64

ఉ॥ స్థితిచెడి పెంపుకుంగి తగుచేతలులేక కుమారులెల్ల దు
స్థితికిరవైన దుర్జనుడు చేటులొనర్చుచు జీవశేషమున్
బ్రతికిన నట్టుబుచ్చుటకుఁ బ్రాల్పడుగాని రమేశ నిన్ను నే
కతమున సంస్మరింప మది గాంక్షవహింపదు ॥చె॥ 65

## —♦ సాంఘిక శతకం ♦—

చం॥ వలచుట చక్కజేయుట శుభప్రదరూపము దాల్చుటాత్మ భ
ర్తల వికసింపజేయుట కరంబనురాగము విద్యనేర్పకే
గలిఁగిన నైజవర్తనజగంబలరించెడు విద్యనేర్చినన్
పొలతు లికెంతవారగునొఁ బుష్కరలోచన ॥చె॥ 66

ఉ॥ మోసము బానిసత్వ మిల మోసము వర్తకవృత్తి భిక్షదు
ష్ప్రాపము యాచకాళికి విపత్తు కవిత్వసమర్థనంబు ల
ధ్యాపకవృత్తి పంచమజనార్హకమయ్యెను యిట్టి సర్వలో
కాపదలందు సేద్యము సుఖంబిడు విప్రకు ॥చె॥ 67

చం॥ కలిమికిని న్దలంపఁడని గాఢదరిద్రమొసంగి జూఁడని
చ్చలు సుతదారపౌత్రపరిచర్యకుఁ దానకనై భవాబ్ధిలో

కలఁగి దివాంధమబ్ధిపడిఁ గారియఁ త్రుంగివరీతిఁ బోవు నీ
తలఁపు నెఱుంగ కజ్ఞుడిల తామరలోచన ||చె|| 68

చం|| జనకుడుమాధ్వుఁ డాత్మజుడు శైవుడు గోడలు వైష్ణవంబు ద
మ్మునిడిగ నేశ మాత్మసతి బుద్ధమతంబు పితామహుండు వా
మనము గభస్తిదైవమత మత్తది గాగ గృహస్థులెం
దును జెడు నీప్రభుత్వమును దోఁడ నెఱుంగమి ||చె|| 69

## నీతిశతకము.

చం|| కనుఁగొని రూపురూపవలెగాని వ్రణంబు ఋణంబు శేషముం
చిన పరశేషమట్లు కడుఁ జేటు సుబాహు హతంబొనర్చి ద
మ్ముని మిగిలింప లేడియయి మోసముఁజేసి మహీజ లంకలో
మనికికి హేతువయ్యెగద మాధవ శ్రీకర ||చె|| 70

ఉ|| సెల్లమజూఁడ శిష్యునకుఁ సేవకవృత్తి సతాగ్నిహోత్రికిన్-
బల్లెల ద్రిమ్మరంజనరు పాసపుఁ జారిణితోఁడఁ గాపురం
బొల్లగరాదు మాఁట విననొల్లని దమ్ములఁ గూడియుండుటన్
జెల్లదు వల్లవాంగనల చిత్తమనోహర ||చె|| 71

ఉ|| దానముగాదు ముష్టిగొల ధర్మముఁ జేసిన పాత్రపాత్రి తా
జ్ఞాన మెఱుంగకున్న పడజల్లిన మాత్ర ఫలింప దుర్వ్య సం
ధానరసార్ద్రికాలనియుతంబులు జూడకయున్న రాజస
న్మానముగాదు లోభికి జనార్దన ||చె|| 72

ఉ|| పెట్టిననాఁడె చుట్టములప్రీతి గడించిననాడె భార్యతోఁ
బట్టరమింప శత్రువులు బారుట శూరతజూపునాఁడె హోం
బట్టువుపాల్పుటంత కిరవైనధనార్జననాఁడె తీర్థముల్
మెట్టుట పిన్ననాఁడె పరమేశ్వర శ్రీపతి ||చె|| 73

ఉ|| యింటభుజంగమున్న దనకిష్ఠులు సోదర లీసుచెందినన్
తుంటవులైన యింటికిరఁదోవలవాఁడు జరత్వజీర్ణమం

దంతలు రాలుచున్నఁ దగ నావరణంబు వహింపకున్న నా
యింట వసింపరాదు నరుఁ డెన్నఁడు శ్రీకర ॥చె॥ 74

చం॥ తనుఁ గని చంద్రుఁ డింద్రుఁ డని దాఁచితదుర్విధు లెల్ల నిత్యముం
వినతులొనర్చు సాధులను వీఁడులంచు దలంచి గర్వకుం
గనకనశించుఁ గూళ నిగ్గలిన యా నహుషుండు సాధులా
మునులఁ దిరస్కరించి చెడిఁబోవఁడె మాధవ ॥చె॥ 75

చం॥ వలతి కనాదిసిద్ధముగ వచ్చిన సంపద హెచ్చుచుండినన్
దొలివగు వంశవర్తనపుఁ ద్రోవకల బోవు చెవంటికబ్బులో
కులదగఁ ముంపు బోటుగనిఁ గూలము దాటదు సాగరంబు వా
కలుజడిబోటకొల్లబయి గాదె జరించును ॥చె॥ 76

చం॥ ఫలమొకయింతలేదుఁ పెఱవారల సంపద కీసు చెందినన్
కలఁత హృదంతరాళమునఁ గారియ వెట్టుట గాని సూర్యరో
చులఁ గలగుండు చెందఁ గనఁ జూడ్కుల కేమి కొఱంత కౌశికం
బులు దమగూండ్ల దాఁగుటలఁ బోవునె శ్రీపతి ॥చె॥ 77

ఉ॥ చేవఁదొఱంగరాదు మృతిచేట్పడనున్న విడాకులిచ్చినన్
భావము చెప్పరాదు దనభార్యకు పోఁగరాదు పోరులన్
జీవను తోఁడ మిత్రులకుఁ జేయదొలంగగరాదు బాసటల్
సేవనిలాట వేల్పులను నెంచగ రాదిల ॥చె॥ 78

ఉ॥ ఆడఁగ జంకబోలదు సభాంతరమందు నిజంబు బంటుజ
క్కాడఁగరాదు దొయ్యలినిఁ గల్లవచింపగరాదు సర్వముల్
బాడగుచున్న నీతివినఁ బాధవహింపగరాదు నెన్నఁడున్
వాడలరేవు బెంకి భువి పాయకుఁ జెల్లదు చెన్నకేశవా 79

---

## —♦ నిర్గుణశతకము. ♦—

చం॥ తనదగు నేర్పుఁ జేత వివిధంబగు వస్తువులెల్ల జేసి తా
గనుఁగొని విస్మితభ్రముఁ గాంచడు గారడివాఁడు గాని నే

ఘనమగుమాయఁ గల్పితముఁగారడిఁజేసి భ్రమించి శాశ్వతం
బనుమతివాడి మోసపడి కంతల జిక్కితి చెన్నకేశవా 80

ఉ॥ ఆదినసత్తు రూపవివిధాకృతిదోపక యుండ దానిక
త్యాదిది సత్తురూపవివిధాకృతులొప్పగ జేసి యన్నిటన్
మాదిరిఁ బట్టియున్న నిను మానవుఁ డెవ్వడు విశ్వరూపిగా
గాదనకెంచువాఁడు నినుఁ గాంచినవాఁడిల॥ చె॥ 81

ఉ॥ కోరికలెన్ని యేనిఁ గలుగున్ పంకింపమనోరథవ్రజం
బూరకఁ బోవఁజాలను సముద్భవకారణమూలవాలమై
వేరిడు మూలమున్న మహీవ్రేల్చమి తత్త్వపథాగ్నిదపి సం
సారమసత్యమన్నుజువుసల్పు మురాంతక ॥చె॥ 82

ఉ॥ మూలమెఱింగి చిత్తమున మోహము జంపి తురీయభావనా
లోలుఁడు జాగ్రత్స్వప్నములోఁబడి తత్త్వము విస్మరింపగా
బోలఁడ నేకవాశితరవోక్తులు దాటిమురారిగోపివి చా
యీలలెఱుంగఁ గోపికల యూప్పిత మట్టులు ॥చె॥ 83

ఉ॥ మాయకులోనుగాక వనమాలిని నిన్నుదలంప జీవులన్
పాయక జీవరూపివయి వర్తిలుటన్ గనుగొంచుఁదా నిరా
పాయపరోక్షసాక్షివిగ భావనసేయు సుషుప్తికావలన్
మాయకతీతతత్త్వమయిఁ మానక భాసిలు ॥చె॥ 84

చ॥ కడలిజలంబు దెచ్చియొక కాచఘటంబునఁబోయ దానికే
ర్పడిన వికారమంబువుపరంబగునట్లు భవాంశమైన యీ
జడుఁడు నుపాధిబాసి నిను సత్వరమొందును కాచనీరముల్
జడనిధిమిశ్రిమింపబడు జందమునన్ దగ ॥చె॥ 85

చ॥ దొరసి సజీవుడైనపతితో రతికిన్వ్యలపించి బాహుబం
ధురపరిరంభచుంబనవిధుల్ ఒరగించిన భార్య ప్రాణముల్
దొరఁగిన యాశరీరమునుఁ దూరము నుండిభయంబు తోఁ
పరలగఁ జూచు నీవరుఁగఁ వట్టిది దేహము ॥చె॥ 86

మ॥ కలిగినశంకలన్ విడచిఁ గాయము దిప్పగ మూలమైన యే
తెలివి నిరంతరంబుఁ దన తేజము పెంపున జీవభావమున్
గలుగఁ జరించి సంసరణ కర్మనిబద్ధము జేయుచున్న యా
తెలివి పరాత్పరుండనుచు దేలుట లేదొకొ ? ॥చె॥ 87

ఉ॥ సూచనకై యరుంధతినిఁ జూపుట కాది ధృవుండు లోనుగా
జూచుట కొనువాఁటిదొలి జూపువిధంబున కోశజీవులన్
జూపుట నేర్పి వానిదగ జూచిన వెన్కఁ దదంతికంబులోఁ
సైచి గ్రహింప నీవనుచు సజ్జనులాడిరి ॥చె॥ 88

ఉ॥ పాతకుడైన ప్రాణము విపద్గతనున్న నిబద్ధుడైన జీ
వాత్మువు బోయినన్ సుతులు పంచత నొందిన లేమి గల్గినన్
నాఁతిసుతుండుఁ దన్ను విడనాడిన సర్వవిచారశాంతక
చైత్యతము కన్న నన్యము శుభంబిడ జాలను ॥చె॥ 89

ఉ॥ కొన్ని పవిత్రముల్ సలుపఁ గూర్చికశాస్త్రములందు శక్తి మే
కొన్న గతిన్ స్వతంత్రమునఁ గొంచముఁ జేకొనఁ లేని జీవికిన్
గొన్నిట లోకతంత్రములఁ గూర్చు నిమిత్తము పేరుమాత్రకున్
గన్న యధేచ్ఛ కాత్మకులుకన్ దగదక్కట ॥చె॥ 90

చం॥ ఫలము భవార్పితంబనుచు బాయకఁ జేసెడి కామ్యకర్మలన్
గలుఁగు ఫలంబు జన్మలిడుఁ గారణసంచితమంచు గూడికే
బొలియుఁ బొలంబులూడ్చుటకుఁ బోయెడిఁ గూలిజనంబులూడ్చియున్
ఫలము గణింపనట్లు పలుబాధల నొందియు ॥చె॥ 91

చం॥ మనలను వేరుగాఁగ జలమావిరిజేసి ఘటంబులోన బం
ధనమొనరించి దానికి యథార్థపు మేఘము నొందనీక మూ
తినిబిగియించినట్లు ననుఁ దేహములోనఁ బిగించి మాయయన్
ఘనమగు పెండువన్న దెర గారియఁ బెట్టెడు ॥చె॥ 92

ఉ॥ మేఁకొని సాధనంబులను మేకు బిగించి ముఖస్థమైన యా
పీఁకిబిగింపు మాయ విడిపించిన వైళమ నిన్ను జేరుదున్

పాకువచింపనేల నిక సాధనకంఖులభింపలేమ ని
న్నేకరణిఁ బిగింపవిడి నెట్టులుఁజేరుదు ॥చె॥ 93

ఉ॥ లోకులు నిటియావిరి విలోలనశక్తిని లోకతంత్రముల్
వీఁకనిజోపయోగమున విల్చుగఁ నను నీశరీరమం
దేకముగాగ జీవమతి నెక్కొనిభేదమొనర్చి మాయయన్
లోకుడు వృద్ధిచెందెడు విలోకనజేయుము ॥చె॥ 94

ఉ॥ స్థూలముకంటెనింద్రియతతుల్ కడుచేవ హృషీకపాళికు
ద్వేలము మానసంబుమఱిఁవేయిమడుంగులు దానికంటెనుం
బోలఁఘనంబు బుద్ధిఁదగ బుద్ధికతీత పరంబుసాక్షియై
గ్రాలెడిదాత్మ నాత్మనెఱుఁగన్వలె ముక్తికి ॥చె॥ 95

ఉ॥ పాఁరెకు నిచ్చినామదిని సంగతమైన పరీక్షలోనిరా
ధారమవిద్యబఁధనకుదార్చి విపత్తునొసంగునంచుప
ల్మారు గణించినిర్గుణఫలాప్తికిమానసమడ్డిఁదాళివిఁ
గోరి భజింతునిన్నెపుడు గోవ్రజమందిర ॥చె॥ 96

ఉ॥ వాఁరక నేనుసించు భగవంతుడు మామకమానసేంద్రియా
గారవిలక్షణోజ్జ్వలవికారనిరంజనచిన్మయచ్ఛిదా
కారుడు గాని యీపురిని గల్గు మనోహర చెన్నకేశవా
కారుడు గాడు బొంకఁగడగండ్లకుమూలము ॥చె॥ 97

ఉ॥ నేనన నీవు నిచ్చలునునీకును నాఁకువిభేదమేమియుఁ
గానఁగలేదు గాన దరిగానని మాయదగుల్వడంగ సం
ధాన నిదానమడ్డిన పిధానమునీవను భ్రాంతినుండుటఁ
మానవజన్మలెత్తుటకు మానుటలేదిల ॥చె॥ 98

చం॥ అనయము నేఁదలంచు పరమాత్మమదీయహృదంతరాళరం
జనరుచిరంబుగాని పరిసంగతకంకణపారితథ్యకాం
చనరసనాదిమండిత దశాంచితపీతదుకూలధారియౌ
మనుజుడుగాడు గాడరయ మాయికతీతుడు ॥చె॥ 99

ఉ॥ బాలుఁడ మానసంబుపరిపక్వము నొందగ నేడు నేర్పుకన్
జాలి నుతించినాడ ననుజాగొనరింపక భక్తపాలనా
శీలుఁడవన్న బిరుదుఁ జేవకొరంగక యుండిప్రీతితో
పాలనసేయవేడెద కృపార్ణవ శ్రీధర ॥చె॥ 100

చం॥ అడుగుటలేదుసంపదల కొరవహింటచులేదు రాజ్యమం
దొడయనిజేయ నింక మదిఁ నున్నదివానక వేడుచుంటిని
యడుగులభక్తి దప్పఁ మఱియన్యము వేడను వేడవేడనో
జడధిశయాన కృష్ణ జలజాయతలోచన చెన్నకేశవా 101

చం॥ పొరసినవేళలన్ గృషికిబోవుచుఁ దెన్నులభింపకాలమున్
జెలుపక బూర్వజోదితవశీకరవర్తనతోడనిత్యమున్
వరపితి నిశతంబు నొకవారములోఁ-భకదీయదాసుడన్
గరిమెళవంశసాగరమ్ము గాంతుడ కృష్ణుడ చెన్నకేశవా! 102



సీతారామా ముద్రాక్షరశాల, నరసాపురం. ప॥ గో॥ జిల్లా.

# ERRATA.

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 2 | 6 | 2 | దలంతుముందటన్ | దలంచెదన్ |
| 3 | 17 | 4 | వష్ఠ | వరిష్ఠ |
| 7 | 40 | 2 | ఛా | చా |
| 7 | 48 | 4 | ద్రి | ప్రి |